# తరతరాల తెలుగువెలుగు

## నృత్యగేయరూపకం

డా. సి. నారాయణరెడ్డి



స్పందన సాహితీ సమాఖ్య

మచిలీపట్టణం

# THARA THARAALA
# TELUGU VELUGU

Dance Drama

*By* **Dr. C. NARAYANA REDDY**

ప్రచురణ పది

నవంబరు ఒకటి 1975

మూడురూపాయలు

ముఖచిత్రం

శీలా వీర్రాజు

ముద్రణ

శ్రీ భారతీ ప్రెస్, మచిలీపట్నం

ముఖచిత్ర ముద్రణ

నేషనల్ ప్రెస్, మచిలీపట్నం

ప్రతులకు

స్పందన సాహితీ సమాఖ్య

23/182E, న్యూ మ్యునిసిపల్ క్వార్టర్స్

మచిలీపట్నం— 521.001

# ఇదీ స్పందన

పాఠకుడు తాను చదివినదాన్ని సంయమంతో, సమన్వయ దృక్పథంతో అవగాహనచేసుకొని అవగాహన చేసుకున్న విషయాన్ని మానవతా మర్యాదల పరిరక్షణకు వినియోగించగలిగినప్పుడు అతని ఆత్మవికాసానికీ సమాజాభ్యుదయ సాధన కృషిలో అతన్ని భాగస్వామిని చేయటానికీ— ప్రేరణ నిస్తుంది సాహిత్యం. అప్పుడు మాత్రమే సాహిత్యానికి నిజమైన ప్రయోజనం సిద్ధిస్తుంది.

ఈ ప్రయోజనాన్ని సాధించే కృషిలో 1969 నుంచీ శ్రమిస్తోంది మా సంస్థ.

అతి తక్కువ ధరకు అత్యధిక సంఖ్యాకులకు ఉత్తమ సాహిత్యాన్ని అందించాలనే సంకల్పం- మా ప్రచురణ కార్యక్రమానికి వెన్నెముక.

ఈ సంకల్ప బలంతో ఇప్పటివరకూ పది ప్రచురణలు వెలువరించాము. ఈ సంవత్సరం పూర్వార్థంలోనే ఇందులో ఏడు పుస్తకాలు వెలువడినై. పరిమితమైన ఆర్థిక వనరులు కలిగిన ఒక సాహిత్య సంస్థకు—ఇది నిజంగా ఒక అద్భుత విజయం! అందునా ప్రచురింపబడిన పుస్తకాలన్నీ కవి పండిత విమర్శకుల ప్రశంసల్ని అందుకోవడం ప్రత్యేకించి గర్వకారణంకూడా! 'కవిత' సంకలనంపై ఒక వారపత్రికలో వెలువడిన సమీక్షలోని ఈ క్రింది వాక్యాలు పునర్ముద్రించడం అప్రస్తుతం కాదనే భావిస్తున్నాము.

"తెలుగుదేశంలో ఈనాడు అవతరిస్తున్న పెక్కు సాహితీ సమాఖ్యలు, వంస్థలకంటే భిన్నమయినది మచిలీపట్టణం స్పందన సాహితీ సమాఖ్య అని ఈ కవితా సంకలనం ఋజువుచేస్తున్నది. స్వేచ్ఛా కవితతో పాటు లయబద్ధమైన లలిత కవితను, సామాజిక స్పృహతోపాటు సాహిత్య విలువలను మేళవింపజేసిన కవితాహారం— 'కవిత'

డాక్టర్ సి. నారాయణరెడ్డి వ్రాసిన 'దేశం ముందడుగు వేయాలి' అనే గేయం ఎంతబాగున్నదో సోమసుందర్ వ్రాసిన 'దేశాలో నీరెండ' కూడా అంతే బాగున్నది. శ్రీ ఇంద్రగంటి శ్రీకాంతశర్మ వ్రాసిన "గది" అనే గేయంలో గాంభీర్యంవున్నది.

డాక్టర్ దాశరధి వ్రాసిన గేయం "ఎఱ్ఱటి నవ్వులు" చాలు ఈ సంకలనం ఎంత బాగున్నదీ సాహితీ పరులు అర్ధంచేసుకోవడానికి.

ఇంతమంది కవుల గేయాలను సంకలనంగా స్పందన సాహితీ సమాఖ్య ప్రచురించడం అభినందించదగిన సంగతి...."

ఈ ప్రోత్సాహం మమ్మల్ని ముందడుగు వేయిస్తోంది. సమకాలీన సాహిత్య ప్రక్రియలైన నవల, కవిత, కథ, నాటకం విమర్శలలో, సంకలనాలు, సమీక్షా గ్రంథాలూ వెలువరించాలనీ; ఔత్సాహిక రచయితలకు ఉపయుక్తంగా వుండే సాంకేతిక వివరాలను ప్రసిద్ధులైన రచయితలనుండి సేకరించి క్రోడీకరించాలనీ,

తెలుగునుడి కారానికీ, పలుకుబడికీ పట్టంకట్టిన వైతాళికుల రచనల్లోని ఆణిముత్యాలకు సాహితీవేత్తల సరళమైనవ్యాఖ్యలు అందించాలనీ.

సాహిత్య సభలూ, సమాలోచనలూ ఏర్పాటుచేసి ప్రసిద్ధవక్తల ప్రాసంగిక వ్యాసాలు స్వీకరించాలనీ, ....ఎన్నెన్నో ప్రణాళికలు చేతిలో వున్నాయి.

........ మా ప్రయత్నాలకు తమ అండదండల్ని అందిస్తున్న వారిలో ఎందరో ప్రసిద్ధులైన సాహితీ వేత్తలు, కవులు, రచయితలు, రచయిత్రులు వున్నారు. వీరందరికీ మా సమాఖ్య ఎప్పుడూ ఋణపడే వుంటుంది. అలాగే, స్పందనబంధువులు స్పందన మిత్రులు, ప్రకటన కర్తలు, ఉదార మహాశయులు ఆర్థికంగా మాకుచేయూతనిస్తున్న సాహితీసేవకులు. వీరికి మా కేలోమ్రొడ్పులు.

ప్రచురణపూర్వ విరాళాల సేకరణలో ఎందరో మిత్రులకు, ఆత్మీయులకు శ్రమ కలిగించటం తప్పనిసరిఅవుతోంది. మా స్థితిని సానుభూతితో అర్థంచేసుకుని- మాకుసహకరించటంలో తాము అనేక యిబ్బందులకు గురి అవుతున్న వారందరికీ అక్షర రూపేణా 'కృతజ్ఞతాభివందనాలు' అనే ఒక్కమాటతో మా హృదయాల్లోని భావాలకు దర్పణం పట్టలేము.

ఈ అనంతచైతన్య యాత్రలో ప్రతి ఒక్కరి సహకారమూ మాకూ ఒక్కొక్క సహకారం!

**స్పందన సాహితీ సమాఖ్య**

# ఆంతర్యం

సంకుచితత్వపు పరిధిలో కుంచించుకు పోయి; ఉదాసీనతల ఇరుకు బావిలో గిరికీలు కొట్తూ; తనకు తెలిసిందేదో తనకే ప్రత్యేకం అనుకొనే అహంభావం తోనూ—పచ్చని పురోగమనాన్ని; "గట్టిమేల్ తలపెట్టిన" వారి కృషినీ చూసి; తనకేదో అందకుండా పోతున్నదనుకునే అసూయాభావంతోనూ—చేతుల్లో నిప్పు రవ్వలు పెట్టుకుని తిరుగుతున్నాం మనమీనాడు.

ఇది అంత తేలికగా మింగుడు పడని వాస్తవం. ఎవరికి వారు ఒక్కింతసేపు అగి, ఆలోచించి, అవునని తలవూచవలసిన వాస్తవం.

ఈ దుర్భరవాస్తవ స్థితిలో నుంచి మనల్ని రక్షించే శక్తిగల ఒకే ఒక్క Beacon light ఉత్తమ సాహిత్యం. అది చైతన్యాన్ని ఉద్దీప్తం చేస్తుంది; అది వ్యక్తిని కర్తవ్యోన్ముఖుణ్ణి చేస్తుంది; అది సమాజాభ్యుదయ సాధనకృషిలో అతనికి కరదీపిక అవుతుంది; మొత్తంమీద సమకాలీన సమాజాన్ని అంతో యింతో ప్రభావితం చేస్తుంది.

కనుక ఉత్తమ సాహిత్యం విరివిగా ప్రచురింపబడి, ఎక్కువమందికి చేరవలసిన ఆవశ్యకత—ఈనాడు ఎక్కువగా వుంది. వ్యక్తి వికాసానికి దోహదంచేసే రచనలు కోకొల్లలుగా వెలువరించవలసిన నైతిక బాధ్యత సాహిత్య సంస్థలమీద వుంది. ఆ ఆవశ్యకతని ; ఈ బాధ్యతని గుర్తించి ఉద్యమవేగంతో పుస్తకప్రచురణకు పూనుకుంది మా సంస్థ.

"మంచిని పంచేది మంచి పుస్తకం ; మనిషిని మార్చేది మంచి పుస్తకం"—అనే విశ్వాసంతో, "తెలుగును తెలుగువాడిలా తెలుగులా వ్రాసే" రచయితల రచనల్ని ప్రచురించి ; ప్రతి తెలుగింటికీ పంచి, ఎద ఎదలో నవచైతన్యం వెల్లివిరిసేట్టు చేయాలని మా ఆశయం. ఈ ఆశయసాధనకు మాతో చేతులు కలిపి నడిచేందుకు మిమ్మల్ని ఆహ్వానిస్తున్నాము. ఆర్థికంగా, హార్దికంగా మా కృషిని ప్రోత్సహించమని అర్థిస్తున్నాము.

'జడప్రాయంగా వున్న
అమిత జ్ఞానం కన్న
చైతన్యరూపంలో వున్న
పరిమిత జ్ఞానం మిన్న'
అన్న కవితోక్తి
స్పందన సాహితీ సమాఖ్య
పురోగమన శక్తి

# ప్రేరణ

వర్తమానం భుజంతట్టి ముందుకు నడిపించే పెద్ద తనం—గతం. జాతి సంస్కృతి గతంలో లేదనుమాట ఎప్పుడూ చెల్లదు. సంస్కృతికి దర్పణాలుగా భాసించేవి—భాష, సాహిత్యం, కళలు: వైజ్ఞానిక, పారిశ్రామిక సాంకేతిక రంగాలలో జరిగే ప్రగతి.

“గతమెంతో ఘనకీర్తి గలది” తెలుగు. భారతీయ సంస్కృతిలో పేర్కొనదగిన అంతర్వాహిని తెలుగు సంస్కృతి. మహోన్నతమైన మన భాషపట్ల అభిమానం, సాంస్కృతిక సంప్రదాయాలపట్ల సదవగాహన; తెలుగు వారి జీవితానికీ, సాహిత్యానికీ, కళలకూ సంబంధించి ప్రయోజనాత్మకమైన కృషిని ప్రోత్సహించటం—ఇవన్నీ ప్రతి తెలుగు గుండెలోనూ వేళ్లూనిన సదభిప్రాయాలు.

ఈ అభిప్రాయాలకు దోహదంచేసి; సాంస్కృతికంగా తెలుగువారి ఔన్నత్యాన్ని పునరుజ్జీవింపజేసేందుకు దీక్ష వహించింది ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం.

తెలుగువారి గౌరవాన్ని ప్రపంచానికి చాటిన ప్రపంచ తెలుగు మహాసభలను వైభవంగా జరిపింది. ఇది తెలుగువారి సాంస్కృతిక జీవితంలో మరపురాని శుభతరుణం.

ఈ శుభ తరుణాన, మన భాష, సాహిత్య చరిత్రల ఔన్నత్యానికి మణిదర్పణంగా వెలసిన— ఈ "తరతరాల తెలుగు వెలుగు"ను ప్రచురించే అవకాశాన్ని మా కిచ్చిన సుప్రసిద్ధ కవి డా. సి. నారాయణరెడ్డిగారికి మా ధన్యవాదాలు. భావస్ఫోరకమైన ముఖచిత్రాన్ని అందించిన ప్రముఖ చిత్రకారులు, మిత్రులు శ్రీ శీలా వీర్రాజుగారికి అభివందనం!

మా ప్రచురణ కార్యక్రమాలకు వెన్నెముక అయిన స్పందనబంధువులకు, స్పందనమిత్రులకు, ప్రచురణ పూర్వ విరాళాలు సేకరించిన మిత్రులకు, ప్రకటన కర్తలకు ప్రచురణ పూర్వవిరాళాలు ఇచ్చిన సాహితీప్రియులకు మా కృతజ్ఞతలు!

ఈ పుస్తకాన్ని అందంగా ముద్రించి యిచ్చిన శ్రీ భారతీ ప్రెస్, శ్రీ నేషనల్ ప్రెస్, శ్రీ నందినీ ప్రెస్ వారికి మా కృతజ్ఞతలు.

స్పందన సాహితీ సమాఖ్య

# ఒక్కొక్క అక్షరం వెనుక

అవును

ఒక్కొక్క అక్షరం వెనుక
గేయలక్ష్మికి తీర్చిన సొబగువుంది,
కళాలక్ష్మికి కూర్చిన మెరుగు వుంది!

ఒక్కొక్క అక్షరం వెనుక
సరళతవుంది, సరసతవుంది,
నవీనత వుంది; భావుకత వుంది;
స్నేహశీలతవుంది, ఆర్ద్రతవుంది, ఆశాలతవుంది;
సాహిత్యసంప్రదాయాల విజ్ఞత వుంది!

ఒక్కొక్క అక్షరం వెనుక
ఛందో వైవిధ్యం వుంది,
భాషావైపుల్యం వుంది,
వ్యుత్పత్తి వుంది,
సాత్త్విక మనః ప్రవృత్తి వుంది!

ఒక్కొక్క అక్షరం వెనుక
నైర్మల్యంవుంది, ఏకీకృత సాఫల్యంవుంది,
తెలుగు వెలుగువుంది, వెలుగు జిలుగు వుంది!!

* * *

అతని మూర్తి — అనంత చైతన్యస్ఫూర్తి :
అతని వాణి — పారుష్యమెరుగని రమ్యాక్షరశ్రేణి :
అతని మందహాసం
ఆహ్లాదమైన ఛందస్సుల సహవాసం :

ఆ కవి విరించి నవతాదృష్టి
మానవత నారాధించే మధుర విపంచి :

అతని పలుకులు కర్పూర కళికలు
అతని కైతలు పొగడపూదండలు :

అతని గీతాలు
మా నవ ( కవి ) జాతిమనుగడకే
ప్రాణంపోసిన మధుర సంగీతాలు :

అతని గవేషణ
అంతేవాస గణానికి చతుర సంభాషణ :

అతని పేరు తలచినా చాలు
మదిలో పొంగు శతకోటి కవితా తరంగాలు :

అతను తెలుగువంటి మనిషి, పాటజీవననాడిగా
వెలిగే యింటింటి మనిషి :

అతను కవితా తపస్సుకు పూనుకున్న ఋషి,
అతను సౌజన్యం పండించుకున్న కృషి :

అతని పేరు పాట,
ఇంటిపేరు చల్లని మాట!
అతను గేయభగీరథుడు
అను వాఙ్మనోరథుడు!!

*　　　*　　　*

ఇది "తరతరాల తెలుగు వెలుగు"
ఇది యుగయుగాల వెలుగు తెలుగు!

ఇందులో గీతికాను సారము
స్వరలయ సంచారము!

ఇందులో గతి
మంజుల శింజినీరవతతి!

ఇందులో దృశ్య సందర్శనం—తెలుగు
సంస్కృతీ సాహిత్యాల సద్విమర్శనం!

ఇందులో ప్రసాదగుణమయమైన పద్యంవుంది
ప్రసన్నతాఫణితిని గద్యం వుంది!

ఇందులో చైతన్య నృత్యంచేసిన హరికథ వుంది
పిడుగులు దుల్పిన బుర్రకథ వుంది!

ఇందులో మందారమకరందాల గీతం వుంది,
మంగళగీతాల మధుర సంగీతం వుంది!

ఇందులో మల్లెవంటి గేయం వుంది
ముల్లువంటి సంఘటనా నికాయవుంది !

ఇందులో రమణీయ దీప నృత్యంవుంది,
కమనీయ జీవన సత్యం వుంది !

ఇందులో తెలుగుజవం వుంది, తెలుగు జీవం వుంది ;
తెలుగు జనంవుంది ; తెలుగు జన జీవనం వుంది !

ఇందులో సొగసైన తెలుగురూపంవుంది,
సొంపైన తెలుగుగళం వుంది !

ఇది 'తరతరాల తెలుగు వెలుగు' ;
ఇది యుగయుగాల వెలుగు తెలుగు

ఇది 'నిక్కమైన మంచి నీలం';
మన అనుభూతిలో నిలుస్తుంది కలకాలం !

* * *

# స్పందనం జీవలక్షణం
# రసస్పందనం సహృదయ లక్షణం

# కలం కంటితో చూస్తే

"దేశమనియెడు దొడ్డవృక్షం
ప్రేమలను పూలెత్తవలెనోయ్"

గురజాడ మాట గుర్తొస్తున్నది.

దేశం వృక్షమైతే రాష్ట్రాలు శాఖలు. ఆశాఖలు పచ్చగా ఉంటేనేకదా పల్లవాలూ, ప్రసూనాలూ.

అంతేకాదు.

ఒంటికొమ్మతో దిక్కులు చూసే చెట్టు-నిటారుగా నిలబడ్డ పీచుజుట్టు. శాఖాబహుళంగా సర్వాంగీణ వికాసం పొందిన మహీరుహం - ఒత్తైన కురుల గుత్తులతో ఒదిగివున్న వేణీబంధం. తల అందానికి ప్రతి శిరోజం సహకారి. తరు సౌందర్యానికి ప్రతికొమ్మ దోహదకారి.

  

భారతప్రభుత్వం ఆమోదించిన ప్రధాన భాషలు పధ్నాలుగయినా నాల్కల ఆకులందున అణిగి మణిగి వున్న యాసబాసలు ఎన్నెన్నో! వృక్షానికి కొట్టవచ్చినట్లు కనిపించే కొమ్మలు కొన్నైనా ఆ కొమ్మల నంటుకొని పసిపాపల్లా పారాడే రెమ్మ లెన్నెన్నో! భారతీయ సంస్కృతిని ప్రతిబింబించే నిలువుటద్దాలు ఏ కొన్ని భాషలో కాదు; అన్ని భాషలూ, అన్ని యాసలూ! మనిషి లోని ఆశయాలనూ ఆవేశాలనూ అక్షరరూపంలో అందించే ప్రబలవాహిని భాష. భాషలకున్న ఈ ప్రాశస్త్యాన్ని గుర్తించడంవల్లనే భారతదేశం తన పటంలోని పాత గుర్తులను తుడిచివేసింది. భాషా ప్రాతిపదికపైన రాష్ట్రాల పునర్విభజనం చేసింది. ఈ విభజనం వైవిధ్యంలోని వ్యక్తిత్వాన్ని సమర్థించేదే కానీ, ఎవరి గంటను వారు మోగించుకునే సంకుచిత ప్రవృత్తిని బలపరిచేదికాదు.

  

భాషాప్రయుక్త రాష్ట్రభావనకు తొలిసారిగా ఆకృతి ఏర్పడింది ఆంధ్రరాష్ట్రావతరణతోనే. విశాలాంధ్ర దృక్పథానికి పరిణత స్థితి ఏర్పడింది- ఆంధ్రప్రదేశ్ అవతరణతోనే.

కళ్ళున్నవారికి కలలు తప్పవు. కలలంటూ కన్నప్పుడు కొన్ని పీడకలలూ తప్పవు. ఆ మధ్య తెలుగునాట అదే జరిగింది. అంచెలంచెలుగా రెండుసార్లు ఆవరించిన పీడకల తుట్టతుదకు విరిగింది. పరిణామం తెలుగువారిలో సమైక్యతాసమున్మేషం.

మొన్నటి ఉగాదినాడు తెలుగుల రాజధానీనగరం హైదరాబాదులో ఆంధ్రావళి పండుగ చేసుకుంది. పదిమందిలో కాదు, వేయిమందిలో కాదు, లక్షల తెలుగు వెలుగుల అక్షుల సమక్షంలో. స్వదేశం పలుకోనలనుంచి, ప్రపంచం నలుమూలలనుంచి రెక్కలు విరిసికొని ఎగిసివచ్చిన ఎందరెందరో ప్రవాసాంధ్రుల - విదేశాంధ్రుల సముఖంలో.

ఆ మహాసభలకు కొన్నాళ్ళు ముందుగా, నాందిగా, నా కలలో ఇలా సాక్షాత్కరించింది-

## "శిరసెత్తిన తెలుగుజాతి"

విశ్వపటములోని తెలుగు
వెలిగే సంవత్సర మిది.
తెలుగుజాతి శిరమ్మెత్తి
నిలిచే సుముహూర్తమ్మిది.

ఎప్పటివాడో ఆంధ్రుడు ?
ఏదో తొలివెలుగు నడుగు ?
కనుగొనవలెనని ఉంటే
గాథాసప్తశతి నడుగు.

తెలుగుజోదు ముక్కాకలు
తీరిన కాలమ్మేదో
కాకతీయ యుగము నాటి
కత్తులె గళమెత్తి చాటు.

తెలుగువారి రసాత్మకత
తెలుగురేని పౌరుషకథ
కొండవీటి గండశిలలు
ఘోషించును ఈనాటికి.

ఆటలోన పాటలోన
తేటతేట మాటలోన
దక్షిణాంధ్రవిభుల కగ్ర
తాంబూలము మున్నాటికి.

తరతరాల తెలుగువారి
వరణీయ చరిత్రమ్మిది
వలుచెరగుల తెలుగుల కల
గలిపిన చిర సూత్రమ్మిది.

ఈ చరిత్ర క్రొంజిగుళ్ళు
సాచి ప్రవర్ధిల్లుగాక.
ఈ సూత్రము అవిచ్ఛిన్న
మై సాగి రహించుగాక.

ఆ సందర్భంలోనే నా గళంలో ఇలా వినదించింది

"విశ్వాంధ్ర వాణి"

విశ్వమంత వర్షించిన వెలుగువోలె - ఆ చల్లని
వెలుగు కంటితుదలలోని జిలుగువోలె - ఆ సున్నని
జిలుగుకు తోబుట్టువైన తెలుగువోలె- ఈ ఉగాది
వచ్చె అపూర్వ చైతన్యవతి: ప్రతి వత్సర ప్రగతి.

నన్నయ కావ్యాత్మతో ప్రసన్నగాతమి ధ్వనించగ
శ్రీనాథుని వాగ్ధుని గోక్షీరరుచులు ప్రసరించగ
పోతన కవితాకృతి రసపూర్ణేందువు పూయించగ
పలికె చిరంతన భారతి; చుళుకీకృత మహతీశ్రుతి.

కందుకూరి సాంఘిక సంస్కరణ భేరి మ్రోగించగ
గిడుగుపిడుగు తెలుగు వెలుగు నుడుల జడులు
కురిపించగ
గురజాడ సరాలకైత కొత్తజాడ చూపించగ
కదలెను నవ్యసరస్వతి; కవచీకృత జీవద్యుతి.

రాష్ట్రాంతరవాసుల నేత్రదళమ్ములు వికసించగ
దేశాంతరవాసుల యెద దివ్వియ లుద్దీపించగ
ఖండాంతరవాసుల హృత్కలాపములు వికసించగ
వెలిగెను విశ్వాంధ్రవాణి; విగతానైక్యతాగ్లాని.

నా దృష్టిలో- గత వైభవగానం వార్షిక నివేదిక కాకూడదని, అది కావాలి భవిష్యదభ్యుదయానికి సోపానమని. ముందుచూపులేని గత కీర్తనసంపుటి- నిప్పురవ్వలు లేని ఉత్త బూదికుంపటి. ఇది నా నిశ్చిత దృష్టి. ఈ దృష్టితోనే జరుగుతున్నది నా కావ్యసృష్టి.

  

ఉగాదిరోజున ఉత్తాలస్థాయిలో జరిగిన ప్రపంచ తెలుగు మహాసభల వైభవాన్ని ప్రత్యేకంగాతీసిన చలనచిత్రం చాటి చెబుతుంది.

మరి, తెలుగువారి తరతరాల సాంస్కృతిక సందీపిని ప్రత్యేకంగా వ్రాసిన నృత్య గేయ రూపకం మలచి చూపుతుంది.

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావుగారి ఆధ్వర్యంలో జరిగిన ప్రపంచ తెలుగు మహాసభల తొలిదినాన ప్రదర్శించిన రూపక మిది.

మహాసభలలో ప్రత్యేకప్రదర్శనకు ఈ రూపకాన్ని రచించవలసిందిగా నన్ను కోరిన సహృదయులు విద్యాశాఖామంత్రి శ్రీ మండలి వెంకటకృష్ణారావు గారు, సాంఘికసంక్షేమశాఖామంత్రి శ్రీ భాట్టం శ్రీరామమూర్తిగారు. దీనికి దర్శకత్వం వహించిన వారు నటరాజ రామకృష్ణగారు.

  

వ్రాసింది నేను; ఆనాడు చూసింది అసంఖ్యాక ప్రేక్షకానీకం; ఈనాడు అచ్చులో పోతపోసింది స్పందన సాహితీ సమాఖ్య.

మరి. ఈ నవంబరు ఒకటో తేదీన, ఆంధ్ర దేశావతరణ శుభవాసరాన, ఈ నాటికను ప్రసారం చేసింది ఆకాశవాణి.

ఇందరికీ నా కృతజ్ఞతావందనాలు.

హైదరాబాదు
1–11–'75 }  —సి. నారాయణరెడ్డి

# తరతరాల తెలుగువెలుగు

## నృత్యగేయరూపకం



శ్రీకాకుళాంధ్రదేవ స్తోత్రం :

మేలుకో శ్రీ ఆంధ్రదేవా !
మేలుకో దివ్యప్రభావా
మేలుకో వంశప్రదీపా
మేలుకోవయ్యా! దేవా! మేలుకోవయ్యా !!

(యక్షకన్యలు ఆంధ్రదేశ చరిత్రను గానం చేస్తారు)

పద్యం : శ్రీరంజిల్లెడు ఆంధ్ర పు
రారమ్య చరిత్ర గేయ రసమయ ఫణితిన్
తీరిచిదిద్దిన రూపక
మారంభించెదము రసికులందరు మెచ్చన్.

సంధివచనం :

ఎవరీ ఆంధ్రులు ? ఎప్పటిదీ ఆంధ్రజాతి ? తరతరాల చరిత్ర పుటలు తిరగేస్తే, అడలిన సంస్కార చక్షువులతో ఆలనాటి ఐతిహ్యాన్ని వీక్షిస్తే కనిపించే దృశ్యాలివిగో........ వినిపించే భాష్యాలివిగో ........

కథాగానం :

వేద కాలమునాటికే ప్రభ
వించినది ఈ జాతి....మన ఆంధ్రజాతి

ఐతరేయ బ్రాహ్మణమ్మున
అలరుచె త్తిన జాతి....మన ఆంధ్రజాతి.

డా. సి. నారాయణరెడ్డి

నిశుంభాదుల నిర్దళించీ
నిలిచిన ఈజాతి!... మన ఆంధ్రజాతి

శకులు యువనులు పహ్లావులు.... ముం
చుకొని వచ్చినగానీ

మొక్కవోని పరాక్రమంతో
చెక్కు చెదరక నిలిచినది ఈజాతి....
మన ఆంధ్రజాతి.

సంధివచనం :

అవును. క్రీస్తుకు పూర్వమే అటు ప్రతిష్ఠానపురం, ఇటు ధాన్యకటకం, శ్రీకాకుళం-రాజధానులుగా, సముజ్జ్వల వైభవాస్థానులుగా, లక్షధనుర్ధర సేనా సముపేతులుగా, దక్షిణాపథ సువర్ణ ఖండాధినేతలుగా, అక్షీణ పరాక్రమంతో అవక్ర విక్రమంతో పరిపాలించిన శాతవాహన సమ్రాట్టులు ఆంధ్రజాతికి మూలవిరాట్టులు. ఆపస్తంబుని సూత్రాలకు అక్షరత్వం కలిగింది అనాడే.

కథాగానం :

అటు పాటలీపుత్రి
ఇటు ధాన్యకటకమ్ము
ఇరుకంబములుగ క
ట్టిరి తోరణాలు—దిగ్విజయ తోరణాలు....

అటు గ్రీసుదేశమ్ము మొదలుగా
ఇటు సయామ్ చైనాలు తుదలుగా
ఉదధులను పాలించినారు—ప్రజాలు
ఓడలను ఎక్కించినారు

యవబలిద్వీపాదు
లందు ఉజ్జ్వల సంస్కృ
తి పతాకలే నాటినారు—చిర భార
తీయ విభవం చాటినారు

ఆయుగమున ప్రభవిల్లిన బృహత్కథ—వి
శ్వాంతరాళ కథాజాల దివ్యసుధ.

నాటి హాలచక్రవర్తి గాథా సప్తశతి
నేటి తెలుగుపల్లెల కమనీయమానగీతి.

డా. సి. నారాయణరెడ్డి

అలనాటి అజంతా అమరావతులు-మ
హాంధ్ర శిల్పి వెలిగించిన అమృతద్యుతులు.

వర్ణింపగరానిది ఆ స్వర్ణకాలం-స
ర్వామతాల లతావళికది ఆలవాలం.
ఆ స్వర్ణకాలం....ఆ స్వర్ణకాలం....

సంధివచనం :

శాతవాహన చక్రవర్తుల నాలుగు శతాబ్దాల విర్వేల పరిపాలనా కాలమది. మరి ఇది—కృష్ణవేణీ తీరాన, విజయపురీ నగరాన-శ్రీ పర్వతం ఒడిలో, నాగార్జునాచార్యుని చల్లని చూపులబడిలో పల్లవించిన ఇక్ష్వాకు రాజన్యులగాథ.

కథాగానం :

'ఇక్ష్వాకు వంశక్షి
తీంద్ర చంద్రుల కీర్తి
కౌముదులు నల్గడల
కలయ విరిసిననాడు;

కృష్ణవేణీ తరంగ
గిణీ పయః కింకిణులు
త్రిశరణ శ్శ్వాసాల
దెసల నింపిననాడు;

శ్రీ పర్వతాగ్రమ్ము
సింహళాగత బౌద్ధ
భిక్షువుల విజ్ఞాన
పీఠకమ్మగునాడు;

సిద్ధార్థుని విశుద్ధ
సిద్ధాంతబీజములు
శాఖోపశాఖలై
సాగిపోయిననాడు'

.... .... .... ....

ఆనాడు—అలనాడు
ఆంధ్రసంస్కృతిమణీ గణకాంతులు
అంబరాల నర్తించిననాడు—
ఆనాడు—

డా. సి. నారాయణరెడ్డి

సంధివచనం :

అనాడు — ఇక్ష్వాకుల ఏల్బడినాడు – శ్రీపర్వత సీమలో సాగిన మహాయాన బౌద్ధమత ప్రస్థానం: నేటికీ మంద్రగంభీరంగా వినిపించే మహనీయగానం.

.... .... .... .... .... .... ....

"బుద్ధం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి"

.... .... .... .... .... .... ....

సంధివచనం :

అదీ ఇక్ష్వాకుయుగం. మరి ఆ తర్వాత - ఆంధ్రావని నేలిన భూపాల తిలకు లెందరెందరో- పల్లవులు- కదంబులు, బృహత్పలాయనులు, ఆనందగోత్రికులు, శాలంకాయనులు, విష్ణుకుండినులు- కడుపుతీపి లెక్కించక అపరాధియైన కన్నకొడుకుకు మరణశిక్ష విధించిన మాధవ వర్మవంటి ధర్మప్రభువులు వెలసిన విష్ణుకుండినులు, ఇంకా, ఇంకా....

కళింగులు, గాంగులు, చోళులు, పశ్చిమ చాళుక్యులు, వేములవాడ చాళుక్యులు, వేంగి చాళుక్యులు- వారే తూర్పుచాళుక్యులు.

అది తూర్పు చాళుక్యయుగం,

కథాగానం :

అవతరించెను నాడు
ఆంధ్రి వాఙ్మయలక్ష్మి
అలరాజరాజు సిరికొలువులో....

అవతరించెను నాడు
వ్యాసభారతవాణి
ఆదికవి నన్నయ పలుకులో-ప్రథ
మాంధ్రి కవి నన్నయ పలుకులో.

సంధివచనం :

ఏమిటా అపూర్వ సన్నివేశం ! తెలుగులో ఆంధ్ర మహాభారతం అంకురించనున్న మహోజ్జ్వల సుముహూర్తం ! అదుగో! శబ్దశాసనుడు నన్నయభట్టారకుడు. మరి వా రెవ్వరు? చాళుక్యాన్వయ రాకాచంద్రుడు - రాజరాజనరేంద్రుడు.

డా. సి. నారాయణరెడ్డి

పద్యం :

"రాజకులైక భూషణుడు
రాజమనోహరు డన్యరాజ తే
జోజయశాలి శౌర్యుడు; వి
శుద్ధయశశ్శరదిందుచంద్రికా
రాజిత సర్వలోకు; డప
రాజిత భూరిభుజాకృపాణ ధా
రాజల శాంత శాత్రవ ప
రాగుడు రాజమహేంద్రుదున్నతిన్" 1

సంధివచనం:

రాజరాజు ఆస్థానకవి నన్నయ భట్టారకునితో మోసులెత్తిన ఆంధ్ర భారతం-మనమసిద్ధి ఆస్థానకవి-తిక్క నామాత్యుని చేతిచలవతో మొగ్గతొడిగింది.

ఇంతకు అది ఏ యుగం ? తెలుగునేల నలుచెరగులను ఒకే కౌలికిలో బిగించిన, ఆంధ్ర సామ్రాజ్య లక్ష్మికి కలికి పచ్చల తురాయి తైసేసిన కాకతీయ యుగమది.

1 నన్నయ పద్యము.

బుర్రకథ :

వినుడు వినుడు మన కాకతీయుల
        వీరచరిత్రమ్ము   తందానా
కనుడు కనుడు ఆ లలిత హృదయుల
        కళాప్రాభవమ్ము తందానా
తెలుగు లక్ష్మికి పౌరుషతిలకం
        తీర్చిదిద్దినారు   తందానా
తెలుగుజాతిని ఒక్క గొడుగున
        నిలిపినారు వారు   తందానా
బెబ్బులులై సంగ్రామరంగమున
        బొబ్బరించినారు తందానా
ఆ
దెబ్బకు ఢిల్లీ సుల్తానులే దద్దరిల్లినారు తందానా

రుద్రదేవునిరూక్షవీక్షణం
        తందాన తందాన తందన
గణపతిదేవుని కార్యపాటవం   ,,   ,,
రుద్రమాంబ నిర్నిద్రపౌరుషం   ,,   ,,
ప్రతాపరుద్రుని భద్రపాలనం   ,,   ,,

డా. సి. నారాయణరెడ్డి

నాటి కాకతీయ సామ్రాజ్యానికి
పెట్టని కోటలురా - ఈ
నాటికైనా మాసిపోని వెన్నెలబాటలురా
భళానోయి భళి తమ్ముడా
దేవభళానోయి దాదానా

కోటలే కట్టినారే - ముత్యాల
పేటలే కట్టినారే - భళాభళీ
పేటలే కట్టినారే.

తోటలే నాటినారే - హై - రాచ
బాటలే వేసినారే —హై - రాచ
బాటలే వేసినారే.

ఆలయాలు తీర్చినారే - శిల్పాల
అందాలు పేర్చినారే- శిల్పాల
అందాలు పేర్చినారే.

చెరువులు త్రవ్వించినారే - తరతరాల
కరువులు తొలగించినారే - తరతరాల
కరువులు తొలగించినారే.

హాస్యకాడు :

చాంగుభళా చాంగుభళారే - మా కర్మ !
చాంగుభళా చాంగుభళారే-ఏం కర్మ !

కథకుడు : ఏమిట్రా నీ ఖర్మ ?

హాస్యకాడు:
గుళ్ళు గుళ్ళంటావు-గొప్పలే చెబుతావు
ఏమిటా గుళ్ళు ?

కథకుడు :

రాలలోపల కోటి
పూలు పూయించిన
రామప్ప గుడిపేరు వినలేదా !

డా. సి. నారాయణరెడ్డి

హాస్యకాడు :

ఆఁ విన్నాం విన్నాం (చెంపలేసుకుంటాడు)

కథకుడు :

విమలశిల్పానల్పవేదియై విలసిల్లు
వేయి స్తంభాలగుడి కనలేదా !

హాస్యకాడు :

ఆఁ ! కన్నాను కన్నాను- మరి చెరువులో !

కథకుడు :

లక్నవరము చెరువు-పాకాల చెరువు
హనుమకొండ భద్రకాళి చెరువు—

హాస్యకాడు :

చాలు- బాబోయ్ చాలు....నాగుండె
చెరువై పోతుంది.

కథకుడు :

ఇంకా విను....కాటసముద్రం, చౌడసముద్రం,
గౌడసముద్రం, విశ్వనాథసముద్రం
ఈ ఒక్కటేమిటి !
కాకతీయులది లెక్కలేని వైభవం
అది
చుక్కలనంటే ఫక్కనవ్వే
మొక్కవోని ప్రాభవం.

సంధివచనం :

మూడు శతాబ్దాలకు పైగా పరవళ్ళు తొక్కిన కాకతీయ వైభవ వాహిని క్రమంగా పాయలు పాయలుగాచీలింది. ఒకపాయ రాచకొండలో దేవరకొండలో రాచరికం నెరపింది. మరొకపాయ కొండవీడులో రాజమహేంద్రవరంలో రెడ్డిగం వేసుకొని ఏలింది.

అదుగో ! రసిక రాణ్మౌళి, లలితకళా బృందావనమాలి-వసంత రాజీయ నాట్యశాస్త్ర రచనా సంక్రాంత చాంద్రీ ధవళయశశ్శాలి కొమరగిరి ప్రభువు కొలువు దీర్చినకాలం. కొండవీటి రాచబాటలో కర్పూర చందన కస్తూరికా పరిమళ వీచికా రసేంద్రజాలం.........

డా. సి. నారాయణరెడ్డి

(వసంతోత్సవం)

అటు వసంతోత్సవ సంరంభం. ఇటు కుమారగిరి సన్నిధిలో రాజనర్తకి లకుమాదేవి చరణకింకిణుల ఘలం ఘలారావం....

(లకుమా నృత్యం....జావళి)

పల్లవి: సరాగాలకిది సమయము కాదురా
మదనసుందర ఏలరా తొందర.

అనుపల్లవి: ఊరెల్ల నిదురించనీరా-మింట
రేరాజు ఉదయించనీరా.
జిలుగువెన్నెల బయట
తొలగనున్నని పైట
అరవిరి పానుపు సవరించనీరా ॥సరా॥

స-ధివచనం :

ఎంత చల్లని యుగం! సంగీత సాహిత్య నృత్యాలు ఉత్తుంగోర్మికలతో వెల్లివిరిసిన యుగం! తిక్కన్నతో మొగ్గతొడిగిన ఆంధ్రభారతం ఎఱ్ఱన్న కరపల్లవాలలో విరియబూసిన యుగం!

అదుగో ! అదుగో ! ఎవరిదా జలదగంభీర నిర్ఘోషం? ఇంకెవరిది? ప్రౌఢదేవరాయల ముత్యాలశాలలో తెలుగుభారతికి కనకాభిషేకమందించిన కవితాసనాథునిది-శ్రీనాథునిది. సాంపరాయని తెలుంగాధీశుని సముఖంలో శ్రీనాథవాణీ నిర్ఘోషమిది.

పద్యం :

అక్షయ్యంబుగ సాంపరాయుని తెలుం
గాధీశ ! కస్తూరికా
భిక్షాదానము సేయురా సుకవిరాడ్
బృందారక శ్రేణికిన్
దాక్షారామ చళుక్య భీమవర గం
ధర్వాప్సరోభామినీ
వక్షోజద్వయ కుంభికుంభములపై
వాసించు తద్వాసనల్. 1

సంధివచనం :

ఇలా ఇలా సాహితీ జైత్రయాత్రలు సాగిస్తూ, తెలుగు కవితను పసిడి పల్లకీలలో ఊరేగించిన ఆ శ్రీనాథుని కాలంలోనే ఏకశిలానగరంలో ఉన్నాడొక మౌని - సత్వగుణాస్థాని. అతడే బమ్మెరపోతన్న - భాగవత భక్తిలత అల్లుకున్న తీయమామిడిగున్న !

---

1. శ్రీనాథుని పద్యం

పద్యం :

"మందార మకరంద మాధుర్యమున దేలు
మధుపంబు వోవునే మదనములకు
నిర్మల మందాకినీ వీచికల దూగు
రాయంచ చనునె తరంగిణులకు
లలిత రసాల పల్లవ ఖాదియై చొక్కు
కోయిల చేరునే కుటజములకు
పూర్ణేందు చంద్రికా స్ఫురిత చకోరకం
బరుగునే సాంద్ర నీహారములకు

అంబుజోదర దివ్య పాదారవింద
చింతనామృతపాన విశేషమత్త
చిత్త మేరీతి నితరంబు జేరనేర్చు
వినుతగుణశీల! మాటలు వేయునేల"! 1

(ఈ పద్యం వ్రాస్తూ ఉండగా ఒకరాజు సమీపంలో నిల్చొని తలఊపిన దృశ్యం. భాగవతం తనకు అంకిత మివ్వవలసిందిగా ఆ రాజు చేయి సాచుతాడు. పోతన్న సందిగ్ధావస్థలో ఉంటాడు. రాజు నిష్క్రమిస్తాడు. సరస్వతి శోకమూర్తియై రంగంమీదికి వస్తుంది.)

---

1. పోతన పద్యం.

పద్యం :

"కాటుక కంటినీరు చను
కట్టుపయింబడ నేల యేడ్చెదో
కైటభదైత్య మర్దనుని
గాదిలికోడల ! ఓ మదంబ ! ఓ
హాటక గర్భురాణి ! నిను
నాకటికిన్ గొనిపోయి అల్ల క
ర్ణాట కిరాట కీచకుల కమ్మ
త్రిశుద్ధిగ నమ్ము భారతీ!" 1

(ఉద్ధృతమైన సంగీతం—మృదంగధ్వానులు—
పటహా కాహళ ధ్వానులు)

సంధివచనం :

ఎక్కడున్నామిప్పుడు? ఎటనుండి వస్తున్నవి ఆ పటహాభేరీ భాంకృతులు, చటుల మత్తేభ ఘీంకృతులు? ఇంకెక్కడినుంచి? — విజయలక్ష్మికి వీరతిలకం దిద్దిన విజయనగరంనుంచి.

---

1. పోతన పద్యం.

డా. సి. నారాయణరెడ్డి

గేయం :

అరిభయంకర భువన విజయ భవనమ్మిది-
అష్టదిగ్గజకవుల కవనరంగమ్మిది.
కృష్ణరాయల విమలకీర్తి సౌధముపైన
విభ్రాజమానమైన విజయధ్వజమ్మిది.

సంధివచనం :

ఆ భువనవిజయంలో - కృష్ణరాయలవారంటున్నారు:

పద్యం :

"తెలుగదేలయన్న దేశంబు తెలుగు-ఏను
తెలుగు వల్లభుండ- తెలుగొకండ
ఎల్లనృపులు గొలువ ఎరుగవే బాసాడి
దేశభాషలందు తెలుగులెస్స!" 1

సంధివచనం :

ఆ సాహిత్య సమరాంగణ సార్వభౌముడు కృష్ణరాయల కోరిక-
ఆంధ్రకవితా పితామహ అల్లసాని పెద్దన ఆశుకవితామాలిక.

---

1. శ్రీకృష్ణదేవరాయల పద్యం

పూఁతమాఱుంగులుం బసరు
పూఁపబెడంగులుఁ జూపునట్టివా
కైతలు? జగ్గు నిగ్గు నెన
గావలెఁ గమ్మన గమ్మన న్వలెన్

రాత్రిరియున్ బవల్ మఱపు
రానిహొయల్ చెలి యూరజంపు ని
ద్దా తరితీపులం బలెఁనుఁ
దారసిల న్వలె లోఁ గదలంచినన్

భాఁతిగఁ బైకొనన్ వలెను
బైదలికుత్తుకలోనిపల్లటీ
కూఁత లన న్వలెన్ సొగసు
కోర్కులు రావలె నాలకించినన్

జేతికొలందిఁ గౌఁగిటను
జేర్చినకన్నియ చిన్నిపొన్ని మే
ల్మాఁతలచన్నుదోయివలె
ముచ్చట గావలెఁ బట్టి చూచినన్

డా. సి. నారాయణరెడ్డి

డాతోడ నున్నమిన్నుల మి
 టారపు ముద్దులగుమ్మ కమ్మ నా
వా తెఱదొండపండువలె
 వాచవి గావలెఁ బంట నూఁదినన్

గాతలఁ దమ్మిచూలిదొర
 కై పసపుంజవరాలిసిబ్బెపు
న్మై తెలియబ్బురంపుజిగి
 నిబ్బర పుబ్బుగుగబ్బిగుబ్బపొం
బూఁతలనూనకాయసరి
 పోడిమి కిన్నెర మేలుబంతి సం
గాతపు సన్నతంతి బయ
 ల్గారపుఁ గన్నడగౌళపంతుగా
సాతతతానతానల ప
 సన్ దివుటాడెడు గోటమీటు బల్
మోఁతలనుంబలెన్ హారువు
 మొల్లము గావలె నచ్చతెన్గు లీ

కీతిగ ........................................

.......................................(చప్పట్లు)

....సంస్కృతంబు పచ
రించెడుపట్టున భారతీవధూ

టీ తపనీయగర్భనిక
టీ భవదానపర్వసాహితీ

భౌతికనాటక ప్రకర
భారతభారత సమ్మతప్రభా

పాతసుధాప్రపూర బహు
భంగఘుమంఘుమఘుంఘుమార్భటీ

జాతక తాళయుగ్మలయ
సంగతిచుంచు విపంచికామృదం

గాతత తేహిత త్తహిత
హాధితధంధణుధాణుధింధిమి

ప్రాతనయానుకూలపద
వారకహూలాద్వహాహారికింకిణీ

డా. సి. నారాయణరెడ్డి

నూతనఫుల్లలాచరణ
నూపురఝూళఝళీమరంద సం

ఘాతవిశుద్ధనీచకచ
కద్విక్రచోత్పల సారసంగ్రహా

యాతకుమారగంధవహా
హారిసుగంధవిలాసయుక్తమై

చేతము చల్లఁ జేయువలె
జిల్లనఁ జల్లవలెన్ మనోహర

ద్యోతకగోస్తనీఫల మ
ధుద్రవగోఘృత పాయస ప్రసా

రాతిరసప్రసార రుచిర
ప్రసరంబుగ సారెసారెకున్.

.....................(కరతాళధ్వానులు)

వంధివచనం :

కవితాప్రావీణ్యపణీశుని తలమాచిన ఆశుకవితాగానం, పెద్దన
నాకాలికి గండపెండేర భూషాలంకరణం........(వాద్యసంగీతం)........

అదిగో ! దినమొక్క కీర్తనతో తిరుమలేశుని సమర్పించిన అన్నమాచార్యుల సంగీతనీరాజనం........

అలరులు కురియగ నాడెనదే -
అలుకల గులుకుల నలమేల్మంగ॥

చరణం 1. అరవిరి సొబగుల నతివలు మెచ్చగ -
తెరమరుగున నాడెనదే
వరుస (వరి) పూర్వాదువాళపు తిరుపుల-
హరికరుణించు నలమేల్మంగ ॥అలరులు॥

2. మట్టపు మలపుల మట్టెల కెలపుల -
తట్టెడినడపులదాటెనదే
పెట్టిన వజ్రపు పెండెపు తళుకులు -
అట్టిట్టుచిమ్ముచు నలమేల్మంగ॥ అలరులు॥

3. చిందులపాటల సిరిపొలయాటల -
అందెలమ్రోతల ఆడెనదే
కందువ తిరువేంకటపతి మెచ్చగ -
అందపు తిరుపుల నలమేల్మంగ ॥అలరులు॥

డా. సి. నారాయణరెడ్డి

సంధివచనం :

ఇక్కడ — ఏడుకొండలపైన తిరుమలేశ్వరునికి దేశికీర్తనల నైవేద్యాలు - అక్కడ, వాడవాడలలోన ప్రజాకవి వేమన్న పలికించిన ఆటవెలది పద్యాలు!

పద్యం :

"నిక్కమైన మంచి నీలమొక్కటి చాలు
తళుకుబెళుకురాలు తట్టెడేల
చదువ పద్యమరయ చాలదా యొక్కటి
విశ్వదాభిరామ వినురవేమ" 1

సంధివచనం :

అల్లదుగో! తంజావూరు నాయక రాజుల సకల సుకళాపోషణలో వన్నెకెక్కిన సన్నివేశాలు. క్షేత్రయ్య మువ్వగోపాల పదాల అభినయ తరంగాలు.

---

1. వేమన పద్యం

క్షేత్రయ్యపదం :

(భామా కలాప దృశ్యం)

(నీలాంబరిరాగము – త్రిపుటతాళము)

పల్లవి :

ఎటువంటివాడే వాడు ఓయమ్మా వాడు-
ఎన్నడు నీ వీధినిరాడు

అనుపల్లవి :

కుటిలకుంతల మువ్వగోపాలుడట ॥ఎటు॥

చరణములు :

1. నల్లని మేనువాడట
నయములెన్నో చేసునట
చల్లగా మాటాడునట
సరసము వాని సొమ్మట
కల్లకాదట వాడు
కళలంట నేర్చునట
ఓయమ్మా వాడు ॥ఎటు॥

2. బంగరు దుప్పటివాడట
పంతములాడుకొన్నాడట
అంగన లెందరినైన
అలయక కూడునట
సంగీతలోలుడట
చాలా ఈవిగాడట
ఓయమ్మా వాడు ॥ఎటు॥

3. నన్నే లేమన్నాడట
నాదుచిన్నెలు తెలిసినాడట
మొన్న నిందువచ్చినాడట
మువ్వగోపాలుడట
చిన్న వయసువాడట చెలియ
అందగాడటవాడు
ఓయమ్మా వాడు ॥ఎటు॥

సంధివచనం :

అదిగో ! అల్లదిగో ! సిద్ధేంద్రయోగి శిక్షణలో కూచిపూడిలో కుట్మలించిన భామాకలాపం.

(భామాకలాప దృశ్యం)

(పారసీక వాద్య సంగీతం)

అది గోల్కొండ సుల్తానుల హయాము. అచ్చ తెలుగుకవ్వాల గులాబులు ఘుమాయించిన తొలిజాము....భద్రాచలం రామదాసు భక్తి గీతాలతో ద్రవించిపోయిన పునీతకాలం....మరి ఇటు ఇటు !

(వాద్య సంగీతం)

ఏమిటీ సుందరనగరం ! భాగ్యమతీ కులీకుతుబుషాల ప్రణయ మందిరం ! ఇదే ఇదే భాగ్యనగరం!

(వాద్య సంగీతం)

ఓహో ; తనువు పులకరిస్తున్నది. అణువణువు పులకరిస్తున్నది. త్యాగరాజు సుధారస వీచికాస్మరణ స్పర్శతో....

(దూరాన త్యాగరాయల కృతి ఆలాపన)

ఆందోళిక - దేశాది

రాగసుధారస పానముచేసి -
రంజిల్లవె ఓ మనసా ॥రాగ॥

డా. సి. నారాయణరెడ్డి

రాగ యోగ త్యాగ -
భోగఫల మొసంగే ॥రాగ॥

సదాశివమయమగు -
నాదోంకారస్వర

విదులు జీవన్ముక్తులని -
త్యాగరాజు తెలియు ॥రాగ॥

సంధివచనం :

ప్రశాంత రమణీయంగా పవళించిన ప్రకృతిలో ఏమిటా ప్రచండ ఘోషలు! కదను తొక్కిన జవనాశ్వ హేషలు!

బొబ్బిలియుద్ధం : బుర్రకథ :

కథకుడు :

పులి పులి పులి పులి బొబ్బిలి బెబ్బులి
కణ కణమండే నిప్పుల పిడికిలి
పట పట పట పట పండ్లుకొరికెరా
ఛట ఛట ఛట ఛట ముందుకురికెరా !

వంత :

ఎవడీ వీరుడు ఓరయ్యా !

కథకుడు :

ఇంకెవడుర కాండ్రి పాపయ్య !

ఎక్కడ ఎక్కడ ఎక్కడ
ఎక్కడరా వాడెక్కడ- సై

బుస్సీ దొరగాడెక్కడ- సై
హైదరజంగు ఎక్కడ- సై
విజయరామ రాజెక్కడ- సై

పచ్చగ ఎదిగే తెలుగుగడ్డలో
చిచ్చుపెట్టిన ముచ్చులెక్కడ !

ఎక్కడరా ఓ హైదర్- నీదో
కుక్కచావురా గద్దార్ !

డా. సి. నారాయణరెడ్డి

ఎక్కడికెళతావ్ బుస్సీ- నువ్వొక
నక్కవురా ఘూ - ఇస్సీ-

ఇక్కడ దాక్కొని ఉన్నావు
    ఒరే విజయరామరాజూ- నీ

పక్కలుంచీల్చి పచ్చినెత్తురు తాగుత ఈరోజు.

చిక్కినావురా కొడకా -
    చేజిక్కేను రా నీ పిలక -
పొట్టకోసమైవచ్చిన బుస్సీ
    జట్టుచేరినావా - భళాభళి

తిన్నయింటివాసాలె
    నువ్వు ఎన్నుతున్నావా - భళాభళి

తాగిన పొదుగును నరికేసి
    పన్నాగం పన్నావా భళాభళి

ఈగలెన్నివాలినా- సై-
    ఏనుగుకేమవుతుందిరా- సై

నక్కలెన్ని గుమిగూడినా-
సింగానికి ఏమవుతుందిరా- సై

నీ డొక్కచించీ డోలుకట్టే
ఉక్కుమగండను నేనేరా

కలకాలం మా చరిత్రకెక్కే
తెలుగు వీరుడను నేనేరా॥
తాండ్ర పాపడను నేనేరా-

సంధివచనం :

తాండ్ర పాపయ్య లెందరు తీండ్రించినా- తెలుగు బెబ్బులు లెన్ని కదన క్షోణిలో గాండ్రించినా-వ్యాపారం నెపంతో భరతావనిలో తిష్టవేసిన పరాసుల వంచనలకు- ఆంగ్లేయుల కుటిలకు తెలుగుజాతి ఎరకాక తప్పలేదు. అయినా- జాగృతజాతి ఎన్నాళ్ళని చీకటి బోనులో చిక్కువడి ఉంటుంది? ఉక్కు చట్రాలను, కటిక చట్టాలను ఛేదించడానికి ఉద్యుక్త మవుతున్నది.

డా. సి. నారాయణరెడ్డి

గేయం :

జాతి మేలుకొంటున్నది- తెలుగు
జాతి మేలుకొంటున్నది

జరిగిన వంచన తెలుసుకొని
కరిగిన కలలను తలచుకొని

జాతి మేలుకొంటున్నది - తెలుగు
జాతి మేలుకొంటున్నది.

కలమును ఖడ్గముగా ఝుళిపించిన
కందుకూరి సంస్కరణ రణంలో-

వాడుక భాషను నిలబెట్టగ పో
రాడిన గిడుగు మహోద్యమ ధృతిలో-

ప్రజల భాషలో సజీవ కవితలు
పలికించిన గురజాడ జాడలో-

రాష్ట్ర స్తుతికై నాంది పలికిన
రాయప్రోలు రసార్ద్రగీతిలో-

తరతరాల తెలుగు వెలుగు

జాతి మేలుకొంటున్నది- తెలుగు
జాతి మేలుకొంటున్నది.

తెల్లదొరల గడ గడలాడించిన
అల్లూరి విప్లవాగ్ని కీలలో-

'రామదండు' నడిపించిన స్వేచ్ఛా
రథి దుగ్గిరాల కార్యదీక్షలో-
సింగంలా శత్రుల కెదురొడ్డిన
టంగుటూరి గర్జారవమ్ములో-
ఆంధ్ర రాష్ట్రమును సాధించిన మన
అమరజీవి ఆత్మార్పణమ్ములో-

జాతి మేలుకుంది- తెలుగు
జాతి మేలుకుంది,

చైతన్యం సమకూర్చుకొని
నూతన పాఠం నేర్చుకొని
జాతి మేలుకుంది - తెలుగు
జాతి మేలుకుంది.

డా. సి. నారాయణరెడ్డి

సంధివచనం :

ఆంధ్రరాష్ట్రావతరణంతోనే కన్నకలలు పరిపూర్ణంగా ఫలించలేదు. మన మరో సురుచిర స్వప్నం— మహాంధ్ర రాష్ట్రావతరణం. అదీ జరిగింది. తెలుగువారి విలువ మూడింతలుగా పెరిగింది.

(దీప నృత్యం)

గేయం :

ఇదే ఇదే తెలుగునేల- నవకాంతులు
వెదజల్లే దీపమాల!

గోదావరీనదీ
స్వాదు తరంగాలతో
కృష్ణవేణి కేలుకలిపి ఆడింది-

తుంగభద్ర జలతరంగ
రంగముపైన
మంజీర మహోదార మధుగీతం పాడింది-

ఇదే ఇదే తెలుగునేల - నవకాంతులు
వెదజల్లే దీపమాల!

తరతరాల తెలుగు వెలుగు

ఏవేవో కలతలతో
ఏవో పీడకలలతో
చెదరిన మనజాతి పరువు
పదిలంగా కుదురుకుంది.
తరతరాల తెలుగు వెలుగు
తెరలుదాటి పరచుకుంది.

ఇదే ఇదే తెలుగునేల- నవకాంతులు
వెదజల్లే దీపమాల!





# గౌరవ సలహా మండలి

కవిపాదుషా శ్రీ పువ్వాడ శేషగిరిరావు
డా. సి. నారాయణరెడ్డి
కళాప్రపూర్ణ డా. దాశరథి
శ్రీ కుందుర్తి
శ్రీ మధురాంతకం రాజారాం
శ్రీ శీలా వీర్రాజు
శ్రీ జి. వీరరాఘవస్వామి
శ్రీ పతివాడ సూర్యనారాయణ
శ్రీ లంక సుందరరామయ్య
శ్రీమతి డి. కామేశ్వరి

# స్పందన సాహితీ సమాఖ్యులు

త్రిపురారిభొట్ల నారాయణమూర్తి ( శాలివాహన )
అక్కల బాబూరావు
శ్రీమతి అక్కల సరస్వతి బాబూరావు
జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి ( విహారి )
పువ్వాడ తిక్కన సోమయాజి
బూదరాజు శ్యామసుందర్
వై. జి. కె. ప్రసాద్
యం. ఏ. వి. ప్రసాదరావు ( విజయమూర్తి )
కాశీపల్లి యోగేశ్వరరావు
త్రిపురారిభొట్ల త్యాగరాజు
బోయిన రామారావు
యల్. రామలింగేశ్వరరావు
పరిమి కృష్ణమూర్తి
గుత్తికొండ సుబ్బారావు

# స్పందన బంధువులు

1. శ్రీ ఇంద్రగంటి వెంకట్రావు
2. శ్రీ రెంటాల సంజీవరావు
3. శ్రీ మహమ్మద్ ఇస్మాయిల్ ( కల్పనా ఛటర్జీ )
4. శ్రీ ఆర్. కె. నరసింహారావు
5. శ్రీ కె. యస్. వి. కె. శాస్త్రి
6. శ్రీ బి. యస్సార్. ఆన్జనేయులు
7. శ్రీ సి. నారాయణరావు
8. శ్రీ పి. జగన్మోహనరావు

# స్పందన మిత్రులు

A

1. శ్రీ దోరడ్ల రాధాకృష్ణమూర్తి
2. శ్రీ చిలకమర్తి సత్యనారాయణ
3. శ్రీ కనకమేడల మాధవరావు
4. శ్రీ డి. ఆర్. యస్. డి. రాజారావు
5. శ్రీ డి. సీతారామయ్య

B 6. శ్రీ యస్. హెచ్. యస్. ప్రసాదరావు
7. శ్రీ డి. వి. సుబ్బారావు
8. శ్రీ కె. యస్. యన్. శర్మ
9. శ్రీ పి. వి. సుబ్బారావు
10. శ్రీ మాశేటి సుబ్బారావు
11. శ్రీ యస్. సుబ్బరామయ్య
12. శ్రీ యం. రామలింగేశ్వరరావు
13. శ్రీ పి. యం. యం. కె. అవధాని
14. శ్రీ బి. శంకరశాస్త్రి
15. శ్రీ టి. బి. సి. రామమోహనరావు
16. శ్రీ పి. సి. శాస్త్రి
17. శ్రీ ఆర్. కొండయ్య
18. శ్రీ ఆర్. అయ్యపరాయుడు
19. శ్రీ పత్రి రామశేషగిరిరావు
20. శ్రీ మల్లాప్రగడ ప్రభాకరరావు
21. శ్రీ పులవర్తి ఓం నమశ్శివయ్య
22. శ్రీ వి. వి. టోణ్ పే
23. శ్రీ కూరాళ్ళ రామచంద్రరావు
24. శ్రీ బి. సుగుణాకరరావు
25. శ్రీ సిహెచ్. దుర్గాప్రసాద్
26. శ్రీ కాకుమాను వెంకటేశ్వరరావు
27. శ్రీ యస్. కోటేశ్వరరావు
28. శ్రీమతి కె. వసుంధరాదేవి
29. శ్రీమతి ముళ్ళపూడి జయభారతి
30. శ్రీమతి శ్రీపతి లీలావతి

# స్పందన సాహితీ సమాఖ్యకు

# చేయూతనిస్తున్న

# సాహితీ మిత్రులు

| | |
|---|---|
| 1. శ్రీ ఆర్. కోటేశ్వరరావు | హైదరాబాదు |
| 2. శ్రీ బి. వి. వి. రాఘవేంద్రరావు | వేటపాలెం |
| 3. శ్రీ ఏ. వి. చంద్రశేఖరరావు | హైదరాబాదు |
| 4. శ్రీ యస్. యస్. ప్రసాద్ | హైదరాబాదు |
| 5. డా॥ పి. చిరంజీవినీకుమారి | కాకినాడ |
| 6. డా॥ కె. వి. కృష్ణకుమారి | తెనాలి |
| 7. శ్రీ ఏ. యస్. ఆర్. మూర్తి | న్యూఢిల్లీ |
| 8. శ్రీ బి. మధుసూదనరావు | చీరాల |
| 9. శ్రీ వి. భాస్కరరావు | చేబ్రోలు |
| 10. శ్రీ వి. పురుషోత్తమశర్మ | ఏలూరు |
| 11. శ్రీమతి ఇంద్రగంటి జానకీబాల | విజయవాడ |
| 12. శ్రీ పి. వి. రామనరసయ్య | హైదరాబాదు |
| 13. శ్రీ జి. చంద్రశేఖర్ | ,, |
| 14. శ్రీ పి. యస్. యన్. శాస్త్రి | ,, |
| 15. శ్రీ తుంగతుర్తి విశ్వనాథశాస్త్రి | హైదరాబాదు |
| 16. శ్రీ అక్కిరాజు జనార్ధనరావు | హైదరాబాదు |
| 17. శ్రీ టి. చక్రపాణిరావు | విజయవాడ |

| | |
|---|---|
| 18. శ్రీ సి. నరసింహారావు | హైదరాబాదు |
| 19. శ్రీ యస్. ఏ. గఫూర్ | విజయవాడ |
| 20. శ్రీ వై. వి. యల్. ప్రసాద్ | హైదరాబాదు |
| 21. శ్రీ పువ్వాడ బాపిరాజు | ,, |
| 22. శ్రీ నజ్జా కోటయ్య | ,, |
| 23. శ్రీ యన్. వెంకటయ్య | ,, |
| 24. శ్రీ కె. వి. యల్. యన్. శాయి | శ్రీకాకుళం |
| 25. శ్రీ బి. ముకుంద్ | విజయవాడ |
| 26. శ్రీ కె. మోహనరావు | బాపట్ల |
| 27. శ్రీ గుమ్మా ప్రసన్నకుమార్ | హైదరాబాదు |
| 28 శ్రీ కాలిపాక మధుసూదనరావు | ఖమ్మం |
| 29. శ్రీ పి. రామపున్నయ్య | గుంటూరు |
| 30. శ్రీ పవని శ్రీధరరావు | మొగిలిచర్ల |
| 31. శ్రీ వి. నరహరిశర్మ | కర్నూలు |
| 32. శ్రీ బి. కోటిరెడ్డి | అద్దంకి |
| 33 శ్రీ వి. యల్. కాంతారావు | ఒంగోలు |
| 34. శ్రీ బి. మదన్ మోహన్ | హైదరాబాదు |
| 35. శ్రీ బి. కబర్ది | వేటపాలెం |
| 36. శ్రీ పెండెం రవీంద్రరావు | హైదరాబాదు |
| 37. శ్రీ వా. స. మూర్తి | అమలాపురం |
| 38. శ్రీ ఇచ్ఛాపురపు రామచంద్రం | అనకాపల్లి |
| 39. శ్రీ జి. వి. పూర్ణచంద్ | విజయవాడ |
| 40. శ్రీ బి. పి. విఠల్ | గుంటూరు |
| 41. శ్రీ సి. ఏ. పి. ప్రసాద్ | తెనాలి |
| 42. శ్రీ ఆర్. మహదేవుడు | విశాఖపట్టణం |
| 43. శ్రీ యం. ప్రభాకరరావు | మచిలీపట్టణం |

44. శ్రీ సుగమ్‌బాబు — మద్రాసు

45. శ్రీ జి. సుందరరామయ్య — విజయవాడ

46. శ్రీ పి. సీతారామ్ — విజయవాడ

47. శ్రీ ఏ. వైద్యనాథమూర్తి — భీమడోలు

48. శ్రీ కె. నారాయణరావు — గుంటూరు

49. శ్రీ యం. యస్. శాస్త్రి — రాజోలు

50. శ్రీ కె. యస్. సుబ్రహ్మణ్యం — హైదరాబాదు

51. శ్రీ డి. యస్. ఆర్. కె. శర్మ — వుయ్యూరు

52. శ్రీ ప్రభల వెంకటేశ్వరరావు — విజయవాడ

53. శ్రీ కోట వెంకటేశ్వరరావు — గుంటూరు

54. శ్రీ వి. వనకుశాలరావు — భీమవరం

55. శ్రీ కె. వీరభద్రశాస్త్రి — గుడివాడ

56. శ్రీ ఏ. వి. కృష్ణమూర్తి — మచిలీపట్టణం

67. శ్రీ బండారు వెంకట్రామయ్య — ఘంటసాల

58. శ్రీ వి. సుబ్బారావు — చల్లపల్లి

59. శ్రీ బర్రెంకల రామచంద్రయ్య — హైదరాబాదు



# స్పందనం జీవలక్షణం!
# రసస్పందనం సహృదయులక్షణం

సమకాలీన సాహిత్యప్రక్రియలైన నవల, కథ, కవిత, నాటిక విమర్శలలో సంకలనాలు. సమీక్షగ్రంథాలూ వెలువరించాలనీ—

ఔత్సాహిక రచయితలకు వుపయుక్తంగావుండే సాంకేతిక వివరాలను ప్రసిద్ధులైన రచయితలనుండి సేకరించి క్రోడీకరించాలనీ—

తెలుగు నుడికారానికీ, తెలుగు పలుకుబడికీ పట్టంకట్టిన వైతాళికుల రచనల్లోని ఆణిముత్యాలకు సాహితీవేత్తల సరళమైన వ్యాఖ్యలు అందించాలనీ—

'తెలుగును తెలుగువాడిలా తెలుగులా వ్రాసే' రచయితల రచనల్ని ప్రచురించి, ప్రతి తెలుగింటికీ పంచి పాఠకుల్లో నవచైతన్యం వెల్లివిరిసేట్టు చేయాలనీ .... మా ఆకాంక్ష, ఆశయం.

ఇందుకు చిత్తశుద్ధితో సాహిత్యోద్యమాన్ని నిర్వహించటానికి పూనుకున్నాము. ఈ సాహిత్యోద్యమ నిర్వహణలో చేయూతనిచ్చి, మా కృషికి సహకారాన్నందించే సహృదయులను ఆహ్వానిస్తున్నాము.

మా ఆహ్వానాన్ని అంగీకరించి మాతో కలిసి నడిచేందుకు ఇవిగో

**అవకాశాలు :-**

# స్పందన బంధువులు

గా చేరడమంటే శాశ్వతంగా స్పందనకు మీ సాహితీసౌజన్యాన్నీ, ఔదార్యాన్నీ ప్రకటిస్తున్నారన్నమాట.




పథకంలో మీకు లభించే సదుపాయాలు :—

(1) మీరు ఒకేసారి రు. 100 లు చెల్లిస్తే చాలు. (2) స్పందన ప్రచురణలన్నీ శాశ్వతంగా మీకు ఉచితంగా అందుతూ వుంటాయి. శాశ్వతంగా మా ప్రచురణలు అన్నింటిలోనూ మీరు "స్పందన బంధువులు"గా పేర్కొనబడతారు. (3) స్టాకులోవున్న పూర్వప్రచురణలన్నీ వెంటనే మీకు ఉచితంగా లభిస్తాయి.

# స్పందన మిత్రులు

గా చేరటం అంటే మీ ఉత్తమ సాహిత్యాభిలాషను, సత్ హృదయాన్నీ మాకు పంచుతున్నారన్నమాట :




పథకంలో మీకు లభించే సదుపాయాలు :—

A. (1) ఒకేసారి రు. 50 లు చెల్లించేవారు చేరిననాటినుండి ఐదేళ్ళపాటు స్పందన మిత్రులు గా పరిగణింపబడతారు. (2) మీరు చేరినవెంటనే రు.10ల విలువకు తక్కువకాని ఉచిత పుస్తకాలు

లభిస్తాయి. (3) మీరు చేరిననాటినుండి ఐదేళ్ళవరకూ మేము ప్రచురించే ప్రచురణలన్నీ మీకు ఉచితంగా లభిస్తాయి. (4) ఐదేళ్ళ తర్వాత వెలువడే ప్రచురణలపై 50% మినహాయింపు సౌకర్యాన్ని పొందుతారు (5) మీరు చేరినతర్వాత మొదటి సంవత్సరకాలంలో వెలువడే అన్ని ప్రచురణల్లోనూ మీరు స్పందన మిత్రులు గా పేర్కొనబడతారు.

B. (1) ఒకేసారి రు. 25 లు చెల్లించేవారు చేరిననాటినుండి మూడేళ్ళపాటు "స్పందనమిత్రులు" గా పరిగణింప బడతారు. (2) తక్షణమే రు. 5 లు విలువకు తక్కువకాని ఉచిత పుస్తకాలు లభిస్తాయి. (3) మీరు చేరిననాటినుండి మూడేళ్ళవరకూ మేము ప్రచురించే ప్రచురణలన్నీ మీకు ఉచితంగా లభిస్తాయి. (4) మూడేళ్ళ తర్వాత వెలువడే ప్రచురణలపై 50% మినహాయింపు సదుపాయాన్ని పొందుతారు. (5) మీరు చేరినవెంటనే వెలువడే మొదటి ప్రచురణలో మీరు "స్పందన మిత్రులు"గా పేర్కొనబడతారు.

C. (1) ప్రతి సంవత్సరం పదిరూపాయలు చెల్లించడంతో చేరిననాటినుండి ఒక సంవత్సరంపాటు "స్పందన మిత్రులు"గా పరిగణింపబడతారు. (2) తక్షణమే రు. 5 ల విలువకు తక్కువకాని ఉచిత పుస్తకాలు లభిస్తాయి. (3) మీరు చేరిననాటినుండి ఒకసంవత్సరం లోపు మా సంస్థ ప్రచురించే పుస్తకాలుకూడా ఉచితంగా లభిస్తాయి. మా ఇతర ప్రచురణలకు 50% మినహాయింపును మీరు స్పందన మిత్రులుగా వున్నంతకాలం పొందుతారు.

స్పందన విజయానికిఅందించండి మీ సహకార ఔదార్యాలు ! అందుకోండి మా కృతజ్ఞతాభివందనాలు !!



# ప్రచురణలు

1. స్పందన (కవితాసంకలనం) రు. 1-00
2. త్రివేణి (కవితాసంకలనం) రు. 1-00
3. వానచినుకులు (కథలు) రు. 2-00
శ్రీమతి డి. కామేశ్వరి
4. మనిషికోసం (కవితాసంపుటి) రు. 2-00
గుత్తికొండ సుబ్బారావు
5. ప్రబుద్ధభారతం (కావ్యం) రు. 2-00
బూదరాజు శ్యామసుందర్
6. కవిత (సంకలనం) రు. 2-00
డా. సి. నా. రె; డా, దాశరథి etc,
7. వికాసం (తెలుగు సంస్కృతికి కవితాంజలి) రు. 2-00
8. జవాబులేని ప్రశ్న (కవిత) రు. 2-00
సాహిత్యరత్న కె. యోగేశ్వరరావు
9. రాగలహరి (నవల) విజయమూర్తి రు. 5-00
10. తరతరాల తెలుగు వెలుగు రు. 3-00
(నృత్యగేయరూపకం) డా. సి. నారాయణరెడ్డి

## రాబోవు ప్రచురణలు

1. తెలుగు విమర్శ (విమర్శనాత్మక వ్యాససంపుటి)
2. "వినరాసుమతీ"-సుమతీశతకముపై వ్యాఖ్య
డా॥ వి. వి. యల్. నరసింహారావు

3. కుందుర్తి పీఠికలు—వచన కవితపై వ్యాసాలు
4. ఊరు వీడ్కోలు చెప్పింది-శీలా వీర్రాజుకథలు
5. శ్రీమతి కావిలిపాటి విజయలక్ష్మి కథలు
6. 'స్మృతి' (నవల) శ్రీమతి అక్కల సరస్వతీ
బాబూరావ్

7. భ్రమరగీత : హిందీమూలం : సూరదాస్
తెలుగుసేత : 'గోపీకృష్ణ'

8. స్వరలహరి : సినిమాపాటల్లో సాహిత్యపు విలువలు
9. రావ్ & యాజి కవితా సంపుటి
10. విహారి & శాలివాహన కథలు
11. ఆంధ్ర చంపూ రామాయణము

స్పందన సాహితీ సమాఖ్య
23/182 E, మునిసిపల్ క్వార్టర్స్
మచిలీపట్టణం-521 001

70

# రాయల్ టెక్నికల్ స్కూలు

కోటవారితుళ్లు సెంటరు : మచిలీపట్టణం

## ‘ప్రభుత్వము వారిచే
## ఆమోదింపబడిన కీ బోర్డు’

గల

# తెలుగు టైపు రైటర్లపై

**విద్యార్థులకు శిక్షణ ఇవ్వబడుచున్నది**

ప్రవేశమునకు త్వరపడండి

**తటవర్తి పాండురంగారావు**

ప్రిన్సిపాల్

శ్రీ లక్ష్మీ శ్రీనివాస వీవర్స్
కో-ఆపరేటివ్ ప్రొడక్షన్ & సేల్ సొసైటీ
లిమిటెడ్., నెం, H. 421
ఘంటశాల దివితాలూకా కృష్ణాజిల్లా
సభ్యులు: 95 షేరుధనం రు. 14,095/-
(డై యూనిట్ కూడా కలదు)

100, 80, 60 40 నెంబర్ల డాబీ-పేటు, సాదాగడి చీరెలు. ధోవతులు, గడిలుంగీలు తయారుచేయబడును.

తుమ్మలచర్ల వెంకటేశ్వర్లు — ప్రెసిడెంటు

తుమ్మలచర్ల రామారావు — సెక్రటరీ

చల్లా సత్యనారాయణ — మేనేజరు.

---

శ్రీనివాసా వీవర్స్ కో-ఆపరేటివ్ ప్రొడక్షన్ & సేల్ సొసైటీ లిమిటెడ్ నెం. H. 194
ఘంటశాల (కృష్ణాజిల్లా)

100, 80, 60, 40 చీరెలు, ధోవతులు, షర్టింగ్‌లు లుంగీలు, పెట్టుబడి చీరెలు తయారీ మా ప్రత్యేకత.

నందం రాధాకృష్ణమూర్తి — ప్రెసిడెంటు

విట్టంశెట్టి పుల్లయ్య — మేనేజర్

| Check List | | | |
|---|---|---|---|
| Book Number | G.V.P01G171 | Date | 23/12/2020 |
| Front Cover | yes | Back Cover | yes |
| Blank Pages | GI, 87, | | |
| Missing Pages | NO | | |
| Prepared | Yameema | Scanned | Swathi |
| BOOK SIZE | H 7.3 W 5.3 | Pages | 91 |